శ్రీ శారదాంబాయైనమః.

# దసరా పద్యములు.

బ్రహ్మశ్రీ గుడిపూడి పూర్ణయ్యకవిగారిచే రచియింపఁబడిన

## రక్తబీజాసురవధ.

యస్. హనుమంతరావుచే ప్రకటితము.



గుడివాడ:
ప్రబోధినీముద్రాక్షరశాలయందు
వ. సీతారామశాస్త్రిచే ముద్రితము.
1912.

శ్రీశారదాంబాయైనమః.

# దసరాపద్యములు.



యస్. హనుమంతరావుచే ప్రకటితము.

దుగ్గిరాల:

ప్రబోధినీముద్రాశాలయందు

వ. నిరంజనశాస్త్రిచే ముద్రితము.

1912.



శ్రీశారదాంబాయైనమః

# దసరా పద్యములు.

శ్రీహరి కరుణా కటాక్ష। సీక్ష్ణాలంకార। అంధ్రజనకుముద చంద్రోదయ। ఆశ్రితవిద్వజ్జనాధార। సత్యభాష। హరిశ్చంద్ర। సంగీత విద్యానారద। సాహిత్యవిద్యాచతుర్ముఖ। దానరాధేయ। సంగ్రామ ధనుంజయ। సాహస విక్రమార్క। శత్రుగజకంఠీరవ। సారికిటుకిసముద శేషుండ। వయ్యారి గోలాహాలకదనవిజయ మార్తాండ। కలియుగ రామ। కలియుగ భీమ। కామినీపంచబాణావతార। మనుజమందార ॥ జయావి వైభవా దిగ్వి వైభవా ॥

## విఘ్నేశ్వరుని స్తోత్రము.

శ్రీపార్వతీకుమార। శ్రితజనోద్ధార। దీపితాకార మోదకమందార। సకలవిఘ్నచ్ఛేద స్వస్తివిహార। అకలంక గుణాకర ఆశ్రితోద్ధార। నీపాదములు నేము శరణమ్మినాము। మాపాల దయయుంచి మన్నింపుకోర। కండచక్కెర తేనె కదళీఫలములను, మేలైన పనసపండ్లు మేలుచెరుకులను। పచ్చి ఉంకాయలును పానకంబులును। గొప్ప నేరేడుపండ్లు గుజ్జుమామిళ్ళు। పాయసంబులు నెయ్యి పంచదారలును। నానుబాలు ప్రాల్లు అతిరసంబులును అరిశలును దోశలును అప్పాలును వడలు, ప్రియమైన తేనెతెరలు కుడుములు జున్ను, మా నైవేద్యంబు గాంచి నువ్వులకాయలును, పూని చెప్పెదమిపుడు పాలువుమీరగను, నిరతముగ సలసినవి స్వీకరించి కరుణ మామీద నిశ్చయముగానుంచి, వెలయంగ నష్టవిద్యల నొసంగి, కలితసంపదలిచ్చి ఘనకీర్తి మించినుత గణాంకుశపాశ త్రిజగన్నివాస, అఖిలప్రకాశ సూర్యాయ్య విఘ్నేశ ॥ జయావి వైభవా దిగ్వి వైభవా ॥

శ్రీకంఠపుత్రాయ సృష్టికర్త్రాయ, వాగీశ వంద్యాయ నాగభూషాయ, లోకజన స్తుత్యాయ లోలనేత్రాయ, పాకారిభూతాయ భవ్య

ఘరిత్రాయ, గజ్జలందాలు ఘల్లు ఘల్లుమనగాను, బాజ్జమెల్లగ కథల హేం
కంబుతోను, ముజ్జగంబుల దివ్యమూర్తివనగాను, గుజ్జువేల్పుల మిమ్ము
గొల్తుమెప్పుడును, పూజింతు మిమ్మెప్పుడు పుండరీకముల, జాజిపువ్వుల
మంచి సంపెంగవిరుల। మరువంపు విరజాజి మల్లెకుసుమముల, నిరతంబు
పూజింతు నెమ్మివేడుకల। పానకము వుండ్రాళ్లు తేనెయిడ్డెనలు, నూనె
బూరెలు వడలు నువ్వుమండిగలు, నానుబాలూ నెయ్యి అతిరసంబులు
ను, పూసి భక్షింపుమీ పాలుపుమీరగను, పిండివంటలు మరియు ప్రి
యఫలంబులును, దండిగా బెల్లంబు తగుపాయసమును, ఖండచక్కెరమం
చి ఖజ్జాయములున్ను, నిండుకొని భక్తితో నీకొసంగెదము, యీవిధం
బుగ మీకు యింపుగాపూజ, గావింతు ఘనవిఘ్నదేవ దేవేశ, జయా,

## సరస్వతీ దేవి స్తోత్రము.

భారతీమాంపాహి ప్రణుతశర్వాణి। వారిజ నను రాణి వరనీలవేణి
శారదశుకపాణిసముదపికవాణి। చారువీణాపాణి సైకతశ్రోణిజయజయతు
శర్వాణి జయతు భద్రాణి। జయతుపల్లవపాణి జయతు అలివేణి। జయతు
పల్లవపాణి జయభద్రవేణి। జయతుపుస్తకపాణిజయనీలవేణి। నీలనీరదవేణి
నిత్యకల్యాణి। నరసముగ నినుగొల్తుసద్గుణకదంబ। శిరులిచ్చి మమ్మేలు శ్రీ
శారదాంబ॥ జయావిజైభవా। దిగ్విజైభవా॥

నాణెముగనమరు వన్నెలముద్దుగుమ్మ। రాణించు సంగీతరశికవేణ
మ్మ। ఆణిముత్యపురాణి అపరంజిబొమ్మ। వాణి నావాక్కున వసియింపవ
మ్మ। తగినవిద్యలుచాల దయసేయవమ్మ। భగవత్పదాంభోజ భక్తి మాకి
మ్మ ముకురకాంతివిడంబ ముఖచంద్రబింబ। చేకూర్చు మాకోర్కె శ్రీశార
దాంబ॥జయా॥

అంబ శశిబింబ జగదాంబ కనకాంబ, తుంబురునారదా స్తుతిశార
దాంబ వాణి శర్వాణి గీర్వాణి అలివేణి, రాణించు బ్రహ్మపట్టపురాణి
వాణి, కలికి కోకిలపాణి కపురంపుబొమ్మ. బాలశారదదేవి భామమా
యమ్మ॥ జయా॥

## § ఈశ్వర స్తుతి. §

శ్రీ గౌరివల్లభా శ్రితజనాధార, నాగేంద్రకేయూరనాగసంహార, పరమునీశ్వర చిత్త వనజాతభ్రమర, పరమపావనచిత్త భక్తమందార, కొండవిల్లుగబూని ఘోరరాక్షసుల, ఖండించి త్రిపురములుఘనకీర్తిగాంచి, అందముగ దుగ్గిరాల్పురనివేశ, ధరనుభక్తులపాలి దాతనాగేశ ॥జ॥

శ్రీపార్వతీసంగచిహ్నితకురంగ, దీపితజటానంద దివ్యశుభ్రాంగ, కుంజరాసురభంగకుధరజాతాంగ, కంజలోచనహృదయకలుషశతభృంగ, కోరిమిము వేడెదము గోపచతురంగ, ధీరతనుమము నేలు దీనాంతరంగ, యితరదైవముల మేమికవేడబోము, సతతమును మిముమదిని సన్నుతించెదము, నీవెదైవంబని నెరనమ్మినాము, నీవెమాకభయంబునీకు మ్రొక్కెదము, పరగంగదుగ్గిరాల్పట్టణనివాస, శరణుహైమవతీశ శరణునాగేశ ॥జయా॥

## § పార్వతీదేవి స్తోత్రము. §

అరవిందలోచన అయినపూబోణి, హరుని పట్టపురాణి అంబురుహపాణి, కరుణించురుద్రాణి ఘననీలవేణి, పల్లవామృదుపాణి పరమకళ్యాణి, తళుకు కన్నులకాంతి ధగధగను మెరయ, బెళుకుకన్నులకాటుకయు మేనుసోలయ, తిలకంబుచే చాల తీరైనయట్టి, మొలకనవ్వుల ముద్దుగులుకుచున్నట్టి, శరణుజొచ్చితి వరములిచ్చి నన్నుబ్రోవు, కరుణతో నాగేశురాణి ననుగావు ॥ జయా ॥

అమ్మమా విన్నపము లాలించవమ్మా, మముబ్రోవగదవమ్మ మముగన్నయమ్మ, త్రిమూర్తులకు ఆధారమైనమ్మ, సామగానప్రియా శౌరిప్రదమ్మా, పరమ దక్షునికొమ్మ బంగారుబొమ్మ, మనసిజాహరుకొమ్మ మముగన్నయమ్మ, సిరులిమ్ముదుర్గిపుర శ్రీపార్వతమ్మ ॥ జయా ॥

## § వీ ర భ ద్రు ని స్తోత్రము. §

పటపట బ్రహ్మాండ భాండంబువగుల, నిటలాక్షుకోపంబు నిగుడించినట్లు, ఘడియలో దక్షుణ్ణి ఖండించితౌర, చటులముగ దుర్గిపుర శ్రీ

వీరభద్ర ॥జయా॥

ప్రసదాశివునకు చెలువమరబుట్టి, భాసిల్లు సంపదలు ప్రతిష్ఠ చేపట్టి, వాసిగా కడువీరకాసియునుగట్టి, హాసియించి దక్షుణ్ణి హతముగా గొట్టి, కావవే మముసురుల కరుణాసముద్ర, శిరులలర దుర్గిపుర శ్రీవీరభద్ర ॥ జయా ॥

## శ్రీవిష్ణుస్తోత్రము.

శ్రీ రాబ్ధికన్యతో చెలగివేడుకను, గౌరవంబున సురల్ ఘనతతో ల్లగను, యీరీతి దుర్గిపురి యింపుసొంపుగను, శౌరి వెలసితివయ్య గోపాలరాయ, శ్రీగజార్చిత దేవ సింధుగంభీర, నీరాకయును నేను నెమ్మివేడితిని, సారెకును దుర్గిపుర సంగీతలోల, తారకేశవరాయరాజరాజేంద్ర ॥ జయా ॥

## కృష్ణలీల.

మంచిదాకృష్ణయిది మంచిదగునటర, మించుబోటులమీద బొంకదగునటర, మచ్చుమందులుజల్ల మనకుదగునటర, ముచ్చకంబులు జేసి యీలయింపరాకు దుందుడుకు సేయుకుర సంధ్యచీకటిని, నందనందననీకు వందనము నేతు, సయ్యాట లాడేవు సమయంబుగాదు, నగుబాటు జేసేది న్యాయంబుగాదు, దధిపాలు వెన్నయును దాహమిచ్చెదను, దధిరావునరసింహదానునికబ్రోవు, దయజూచి రక్షించు దీనమందార. భళిర శ్రీదుర్గిపుర బాలకృష్ణమ్మ ॥జయ॥

ఏమిరా! శ్రీకృష్ణయింతయాగడము, తగునటరయిదినీకుజగతిలోపలను, రేపల్లెవాడలో గోపసుందరులు, వింతగాజెప్పెదరు సంతతమునాతో, గొల్లభామలతోను చెల్లాటలాడ, భామనీపయిటలో బంతున్నదనుచు, పట్టుకుందునటం చుబలికినావటరా, నాముద్దు కృష్ణమ్మనాచిన్నతనయ, నావేణుగోపాల నందసుకుమార, అనియిట్లు తల్లి తన్నదలించిపలుక, తల్లిముందరనిలచి తానిట్లుపలికె, అమ్మరో వినవమ్మ అతివగోపెమ్మ, చిన్నవారలతోను చెలగి చెండ్లాడ, నాబంతిపోయెనే దానింటిలోకి బంతితెమ్మనినేను బలుకగాజూచి, గోపస్త్రీలందరు గుంపులుగగూడి, నీ

బంతిలాడుభోగము నిన్నరుగమనిరి, అనుచు కృష్ణుడుబలుక అతివలో విమ్మ చిరుతకొమరుని జూచి చెలగి తాబలికె, కాత్యాయనీదేవికరగి పూజింప, జలక్రీడలాడగావలను గాజూచి, చెలగినలువలుతీసి చెట్లపైబెట్టి, యువతులు చీరలనుంచివావటగా, అతిదూర్తతనములిట్లగుటనీకగునా, నాముద్దుకృష్ణమ్మ నాచిన్నితనయా, నావేణుగోపాల నందనుకుమార, అనగతల్లికిబల్కె నాచిన్నకృష్ణు, చెంగల్వకొలనులో చెలియలందరును, చాదలరనమ్ములు నాగడ చెలగవారలము, జలక్రీడలాడగా జలజాక్షి యొకతె, కనుసైగచేయగా కదలివెళ్లితిని, ఇంతకన్నా నేను ఎరుగనోయమ్మ॥జయా॥

## దశావతారములు.

దివముసంపదలొసగు దివ్యావతార, ఘనచెన్నకేశవా కరుణావతార, మనుజనకమును నేలు మత్స్యావతార, గురుతుగా కృపజూపు కూర్మావతార, వరదుడవ్వుగావయ్య వరహావతార, శిశులుకరుణించు నరశింహావతార, వత్సమునసిరిగల్గు వామ్నావతార, రక్షించుమమ్మునరశురామావతార, రాక్షసాంతక రఘురామావతార, పక్షివాహన బలభద్రావతార, బ్రోవనేర్చినయట్టి బుద్ధావతార, కావవేమమువేడ్క కలికావతార దేవేశ దుర్గిపురి దివ్యనగరేశ, శేవకులరక్షకా శ్రీచెన్నకేశా॥జ॥

## శ్రీలక్ష్మీదేవి స్తోత్రము

శ్రీలలో వెలసిన శ్రీలక్ష్మమ్మపాల సముద్రములోన ప్రబలితివి కొమ్మ, చెన్నకేశవురాణి చెలువు మాయమ్మ వాలాయముగ మాకు వరములీవమ్మ గరిమతో మామనవి గైకొనవె బాల, గౌరవంబున మమ్ము కరుణించు చాల, కాపాడుదువు జనుల కనకంపుబొమ్మా కమలషంఖవల్లి కాంత మాయమ్మ॥జయా॥

## శ్రీఆంజనేయస్తోత్రము

జలధరునికృపను యంజనికిజన్మించి, ఫలమనుచు మింగితివి, భానుకబళించి. అలరామలక్ష్మణుల సద్భక్తిగాంచి, మీరితివి రావణుని మేటిసర్వము, కోరితివి రామవిభు కొమరుపాదముల. భూరిభుజాబలమునను బుధశు

తవిశేయ, మేరుగిరిసమకాయ | శ్రీయాంజనేయ॥జయ॥

శ్రీరామభక్తుడని చెలగిలోకముల, ధీరతను అంజనా దేవిగ
ర్భమున, అతూధిబుట్టితివి అతిసంభ్రమమున, శూరుడన బరగితివి సార
దివిజయమున, పండనుచు భాస్కరుని పట్టమింగితివి, నిండుమనమున
రవిని నింగినిల్పితివి, సరవితో శ్రీరాము సంధికూర్చితివి, హరిచేత వా
లినటుహాతముచేసితివి, పతియాజ్ఞచే రాము ప్రభువుకార్యమును, హిత
వుచే కపిసేనహెచ్చరించుటకు, జతకూర్చినాలుదెసల జాడదెచ్చుటకు, అ
తిరయంబునబంపునప్పుడు రాముసకు, వందనము గావించి వరుసతోడు
తను, పొందుగాదక్షిణాంబుధి చేయువనము, జాడజాడల పృథివితనయగ
నవలెను, నేడ్కలలరగ నీదు విక్రమంబొప్ప, అనుచువార్థియుదాటి న
ట్టి హుంకించి, దనుజరావణుపురము సమ్ముఖముపొంది, రమణియైయు
న్న యా లంఖిణివధించి, అమరారి పురమంత అవుడుశోధించి, జనకజ
ను గనలేక చాల చింతించి, అనువుగా నట్టిమొదలన్నియును గాంచి,
వనగుహాక్షి నిగనక వచ్చిశోకించి, వనరుహాక్షిణియున్న వనము వేగాంచి,
రామభజనలు సేయు రమణినటుచూచి, భూమిజయున్నయా భూరుహామె
క్కడాసి, రావణాసురునటుకు రాకగనిజూచి, కావరపు మాటలను క
మలజనునేచి, అనువుగాదిది వేళ ననిచాలయోసి, భూలోకమాత శీత లో
లాక్షిగనక, శోకలాప్పుచుప్రాని క్రిందికినిజనక, ఓకపీశ్వరమీరుయెవ్వరో యు
నగ, జోకతోడుత రామభటుండనన, ప్రాకటంబుగతనదు ప్రాభవంబొసగు,
రాకగనిసంతోషరగము నందముగ, చిలుకను రఘురామ క్షేమంబు నదు
గా, వెలయుగా చెప్పితివి వేట్కచే వినగా, అనవాలొసగితివి అవుడు మై
థలికి, దానవాదము జూచవననిపుడుబలికి, మానగావనములో మనవు
లనిజూచి, దీనులగువారిని తెలిసిమన్నించి, దనుజులను పెకలించి ధర
ణిపైగూల్చి, అక్షకాసురుద్వంచి అనుర్గుల విదల్చి, రక్షించి యాయిం
ద్రజిత్తుచేజిక్కి, పుణ్యజనపతిగనుచు పొందుగనుప్పక్కి, గణ్యామనితలచ
కనుకట్ల నటుజిక్కి, వున్నదిదె మర్కటము యొనగ నుతికెక్కి, యున్న
నగ్నికి వెరచి నటునీవునక్కి, మూకరాక్షసులెల్ల, మొనసినాలమున,
కోకలన్నియు జుట్టికొనుచు మేలమున, అనలంబు దరికొల్పి నంతలో దెచ్చి

ఘనమయిన లంకంతగాలగానిచ్చి, ఖలువుగా నడమి చేల్లారనిచ్చి, లలి నొప్పశీతగని రమణితోవచ్చి, నాదరంబుగనిల్చి సాష్టాంగమనుచు, దండంబు బెట్టగను ధరణిజయుమెచ్చి, భండనోద్దండుడిని ప్రవణునకుదెచ్చి లలితముగ యాసిరో రత్నమునిచ్చి, సెలవొసగి దీవనలుచాలగానిచ్చి త్వరితముగ జనమనెను సర్వమొసగగను। నురువడిన నినుడు సొంపుమీర గను, మునువుగా యాకడలి ముదముతోదాటి, కులమువారలకెల్ల కొమరుగాసూటి, నసుదాగా రఘురాము నానందమొంద్రె, రమణిగంటిని రాజ్యలక్ష్మిమిముజెంది, అని రత్నమిచ్చితివి అతిసంభ్రమంద, హనుమంత ధీమంత అతిశౌర్యవంత, ఇనకులజు నిల్పితివి మహి కరుణావంత, యినసమానము బెరగితివిగదాయింత, ఘనతరము నీమహిమ గట్టిగానెంత, పని కైన నోపుదువు బాహుబలవంత, కరమొప్ప సుందరా కాండకథయంత, పరగ మహార్ణవమి పద్యముకొంత, పాలువుగాజెప్పితిని స్తోత్రిగానంత, కీర్తిమించగ యాకృతి మీనకనాత, వరగుగ్గిరాల్పుర ఘనదయస్వాంత, వివరించి మముబ్రోవు నీరహనుమంత ॥ జయావిజైభవా ॥

సిగ్గికాలువరీతి పెనువార్ధిదాటి, చాలువుగాలంకలో శ్రీరాముమేటి కల్లరక్కసిమూక ఖండిచమేటి, చలముతో మముబ్రోవు నిలబుధసహాయ ॥ జయావిజైభవా దిగ్విజైభవా ॥

## దీవెనసద్యములు.

శ్రీమంతులై మహా శ్రేయములుగలిగి, భూమిలో వెలలేని భోగములుగలిగి, ధనధాన్యములుగలిగి ధర్మములుగలిగి, ఘనవస్తు గజతురంగవ్రజముగలిగి। రాజసన్మానంబు రాజ్యంబుగలిగి, తేజంబు ప్రాభవాస్తోమంబుగలిగి, అందలంబులుగలిగి ఆశికీర్తిగలిగి, పొందుగా నవరత్నభూషణాల్గలిగి, బంగారు మేడలును కరిఘులును గలిగి, శృంగారవధులతో చెలువములుగలిగి, సతులతో హితంతో సౌఖ్యములుగలిగి, సుతులతో నుతులతో శోభనాల్గలిగి, గంధమాల్యాంబరా భరణములు లిగి, బంధుజాలంబులు ప్రఖ్యాతిగలిగి, అన్నదమ్ములుమీరు ఆయువులు గలగి. తనయులకు తనయులకు తనయులంగలిగి, మనములకుమనములకు మనములుంగలిగి, పాడియును పంటయును బాగుగా గలిగి, గాడినురభులు

ఋమీకు ఘనముగా గలిగి, వన్నెవాసియుగలిగి వర్ధిల్లరయ్యా, సస్నశా
చారములు జరిగించరయ్యా, శ్రీయెలమితోడుతెను ప్రసిద్ధిగామీకు, ఆ
యువును పుత్రపౌత్రాభివృద్ధిగాను, పసిబిడ్డలము మేము పలుమారుదినుగ
పసివాడియున్నాము యెండవానలకు, అయ్యావారికిచాలు ఐదువరహాలు
పిల్లవాండ్లకుచాలు పప్పుబెల్లాలు, పన్నుగా ఖర్జూరపండ్లయిదు శేర్లు, నా
రికేళఫలాలు నూరైతెచాలు, రేపురా మాపురా మళ్లిరమ్మనక, జాగు
చూపులుచూచి చాలుపొమ్మనక, చేయప్రాగ్గుదిప్పినా యివ్వవలెగనుక, ఎం
త సేపుండుమూయింతదయ లేక, పప్పుబెల్లంబులు బాలురకునెల్ల, యిప్పిం
చిపంపుడీ ఘనలరంజిల్ల ॥జయ॥

శ్రీరస్తు విజయస్తు చిరకీర్తిరస్తు, భూరి వైభవమస్తు పుత్రలా
భస్తు. ఆయూశ్రీగామీకు ఐశ్వర్యమస్తు, కొడుకులును కోడండ్లు కొమ
రొప్పగలిగి, వసుగులును పైర్లిస్లు వయసత్యో గలిగి, ఎడబడనిసంపదలు
ఎప్పుడును గలిగి, ప్రజమి వర్ధిల్లెడి పున్యాములుగలిగి, అల్లుండ్లు మానము
లును అధికములుగలిగి, కొల్లలుగ ధనధాన్య కొట్టులుంగలిగి. శ్రీలక్ష్మీ
మీయింట చాలగు బంగారు, పూలపూజలుచేసిపాలుపొందినారు, ఆశ్వ
యుజ శుద్ధ మహార్ణవమి మొదలు, శాస్త్రోతా శీర్వాద సత్యవాక్యముల,
బాలలా దీవెసలు బ్రహ్మాదీవెనలు, శ్రీతైనైన శ్రీవిష్ణుదేవు దీవెనలు,
శ్రీకరంబైనట్టి శివుని దీవెనలు, ప్రాకటంబుగ ఋషులు పలుకుదీవెనలు,
పహాది కొనకనను వేన్నా మిమ్ము, వేమ్ర వచ్చితి మిమ్రుడు విభనాబు
గాను, వెయ్యాయలను మేము వేసరాలేదు, అయ్యావారికిచాలు ఐదువర
హాలు. పిల్లవాండ్లకుచాలు పప్పుబెల్లాలు, పన్నుగా వకతూము పప్పైతె
చాలు, మంచిగు బెల్లము నెయ్యి మాకు యిప్పించి, ఝణఝణత్కారము
గ సాగసంపించు, విందుబియ్యముపప్పు విడియుంబులిచ్చి, పొందుగా నె
య్యిచ్చి పోంచయ్యుమనుచు, పెట్టెలోచీమంచి ప్రియమయినశాలు, ధ
ట్టీకనాయీలు లగటిపాగాలు, యిట్టిగానిప్పకను యివుడురమ్మనక, యి
ప్పుడే అయవారి కిప్పించవలెను, తప్పకను యిప్పుడే దయచేయవలెను
దుష్టజనులను బ్రస్తుతించేది లేదు, లోట్టకష్టపువార్ని అడిగేది లేదు, పొసగ
పినులోభులను పొగిడేది లేదు, నగిడివారముగాము తెగువలేనపుగపా

తలప్పాలుగావు పలుమారునడుగ, అల్లుండ్లవలెగాను అలగి యిమ్మనుగో పరగంగ చినచిన్న బాలురము మేము, త్వరగ దయ శేయుడీ బహుమానములును, రేపురా మాపురా మళ్లిరమ్మనక, యిప్పట్లొ లేదనక యివ్వవలెమాకు, పోకుంట ఘడియలో పోయిరమ్మనక, శ్రీరాములిచ్చుబహు శిరియు నాయువులు ॥ జయా ॥

## § బ్రాహ్మణులమీది పద్యము. §

పరగంగ నక్షత్ర పంక్తులనుబోలు, ఘనమైన యురుమంచి ముత్యములబోలు, తరుచుగా మాణిక్యములగెల్వచాలు, నిర్మించి చూడుడీ నిద్దంపుబ్రవాలు, నేర్పుచే సభలలో నీమాటబోలు, యేర్పరించిన తలంపు యెవ్వరికి లేదు, ఖండచక్కెర పానకంబు నీమాట, నిండుచంద్రుని బోలు నీముఖము తేట, నిర్యోగిరత్నమని నిన్ను సత్కవులు, వెయ్యారుకృతులిచ్చి వెలయుకోరికలు, నెయ్యములరంగాను నుతిపరస్తుతులు, సయ్యాన మిముబొందు సామంత్రివరులు ॥ వసుధలో

సొగసైన జలతారు పాగ తలజుట్టి, నగమీర జిలిబిలీ వలెవాటువేసి, రంగుమీరిన పూల అంగీలుతొడిగి, బంగారు నడికట్టు బాగుగాగట్టి, మిసిమిగలిగిన కోర మీసములుదువ్వి, పసిడిపువ్వులశాల్వ పైనిండగప్పి, తళుకుల్తినుసు కలందాను నేపట్టి, కులుకుచుదస్త్రముకొనగోరనేపట్టి, ఉరుమంచి ముత్యాల పేరులునుమెడవేసి, పరగంగ పచ్చలా పల్లకీయెక్కి, దగ ప్రకాశించితివి ధనుడనైనట్లు, వసుధలో

## వైదికులమీదిపద్యములు

బ్రహ్మముఖమున మీరుపగగ జన్మించి, నాలుగువేదముల్ నయముగా జదివి, ఆరుశాస్త్రంబుల నమరంగజదివి, యజ్ఞ యాగంబుల ప్రతిష్ఠతో జేసి, షట్కర్మములు మీరు చాలగా నడపి, కాను సోమపానముల కడకుబోవ్రోలి, నిత్యాన్నదానంబు నియమిగా జేసి, వేదాంతమార్గంబు నేమరక జడిపి, అడిగిన జపంబులన్ముట్టినిచ్చి, నినాయకులు మిమ్ము కరుణబూజింత్రు, యితరులను బ్రాహ్మణులన్ని సభుడు గొని సూక్ష, మింతిలేసినందలు మీరాయుటగపేని శ్రీ సిన్న మీరాలుట స్థిరముగా నుండు, మూర్తులగన్నములిచ్చి మన్నింపుమయ్య పరుమా॥

## వైశ్యులపద్యములు.

కోటికిని పడిగెత్తి కోమట్లలోను నూటొక్కగోత్రమున నుతికే యగాను, హాటకోజ్వలరత్నహారములకోను; పాటించినీకీర్తి ప్రఖ్యాతి గాను, వున్నతము పెనుగొండ వైశ్యరాధేయు, సంగతిగవాల్మీక సద్ధర్మనిలయు॥ వసుధలో

వైశ్యులందరు మహా వర్ణనలుగాను, శాశ్వతముభాస్కరాచార్యునీవలెను, నూటొక్క గోత్రాన నుతికాయగాను, పాటిగాహెచ్చి తిరి భళిభళీయనగ, జయూ॥

## కమ్మవారిమీద పద్యము.

అరివర్గముల గుండె లదరునీధాక, తురగపంక్తుల బారడోలు నీ మూక, కరిఘటల వురిగొల్పు గరిమనివుగాక దరిమి గుంపులుసేయు తగునీదు లేక, వరబలంబులమర్మ భంగమిూ రాక, చిరకీర్తిజయలక్ష్మి చేకూరుగాక, ధర్మమార్గంబులు దలచితివిగాక, చేరవచ్చిన అర్థిజనులరక్షింప, కమ్మవంశమునందు ఘనుడవైపుట్టి, కరుణదలచితివార గాంభీర్యపురుష ॥ జయూ ॥

## తురకలమీద పద్యములు.

సాహెబుమెహార్బాన్ సలిలతసలాము, ముష్ఫిక్ కదర్దాన్ మెహావుసలాము, పక్కుపయిజురసాన బందగుసలాము, ఆయూనుపండతుక్కజాహానవహాన పండత్తుక్కరూపాయ హాంసుఫుతాని, మటులాయసూచరు ఆ బీరులయిన; బాల్బలాహానబహుతుక్కమీహాన, ఆషీపమాయదు మెహర్బానిహాన। పేరునమెహర్బాన్ పెంపుభావింప ॥ వసుధలో॥

మహార్ణవమనుపద్యములు సతపూర్ణము.

ప్రేమతో భృంగీశ్వరు వేడ్కతొ ప్రేరణములుద్రొక్కగ
సాంబా ప్రేరణములుద్రొక్కగ

7. చండీశ్వరుఁడును కనులపండువుగ చెలువుమెరయగాను
బరాబరులునల్పగాను, సకలప్రజలు చూడగాను
నిండువేడుకతో నిట్టివిభవమున యిందుశేఖరుండు
సాంబా యిందుశేఖరుండు

8. కొలువుదీరికూర్చున్న కాలమున నలినసంభవుండూ
నమరాధిపుడుదండధరుడూ, వహ్నియువై వస్వాతు మొదలు
కలకలధ్వనులతో కలగివేల్పులు కడుసౌఖ్యంబునను
సాంబా కడుసౌఖ్యంబుననూ

9. కొలకులనీరొలుకగను నిలింపులు వెలుపలి ద్వారమున
నిలచియుండినదుఃఖమునా, మునిగియుమిక్కిలి ధైర్యమునా
కూతలుబెట్టుచుకుధరనిలయ యనికుందినహృదయమునా
సాంబా కుందినహృదయమునా

10. కావుమయ్యసరిగునమమ్మిస్వాపకనకాచలచాపా
సాంబా కామవిజితరూపా, చంద్రకళాపమంజులాప
ప్రాపునీవెయనిదాపుజేరితిని చేపట్టియుబ్రోవు
సాంబా చేపట్టియుబ్రోవు

11. యనుచుబల్కుయార్తరవంబునువినిశంకరుడపుడు
విస్మయమందుచు మరియందు, వేగమెచండీశ్వరుగనియు
వేల్పులదోడ్కొని రమ్మనిబల్కె నువేద వేద్యుఁడపుడు
సాంబా వేద వేద్యుడపుడు

12. బెంకుపడియువాకిటనిలచినసురతుండంబులజూచి
చండీశ్వరుడమరులజూచి, దండిగవారలదోడ్తెచ్చి
కుండలిభూషణుదండజేర్చి తాచండవిక్రముండు
సాంబా చండవిక్రముండు

13. కనులనీరు కాలువలై బరువుగకరపుటములసాచి
తనువులువణకగతాజూచి, షాగజేసి వేల్పులవీక్షించి

జడవకుడని వృషభేంద్రగమనుడతిత్వరగనిట్టూనిరోణా
సాంబా త్వరగనిట్టులనిరోణ

14. గాసిల జేశినఖలుడెవండుమిము గదశి వేల్పులారా
మిమ్మేలగాచెదఘనులార, ద్వేషునిద్రుంచెదసురలార
భాసురముగ మదిలోపల దిగులును బాయుడు యీ వేళ
సాంబా బాయుడుయీ వేళ

15. యిత్తెరగున కరుణాకటాక్షుడై యీశ్వరుండుబలుక
దనుజునివిధమంతయుబాగా, దెల్పగ దాడగిరిహరు మ్రోలా
నత్త్రిఋషిసత్తములు హర్షమునదీవించిరిచాలా.
సాంబా దీవించిరిచాలా

16. రక్తబీజుడసురాత్త సాధము రణకర్కశుడగుచు
తానతిశక్తివంతుడగుచు, యచ్చట జూచిన తానగుచు.
హెచ్చుగమము బాధింపదొడంగెను యెంతనిదెల్పెదము
సాంబా యెంతనిదెల్పెదము

17. రిక్తులమై మేమిప్పుడు సరగున రిచ్చపాటునొంది
ముక్తీశ్వర నీదరిజేరి, ముదమున భక్తితో పూజించి
భక్తపాలనాసక్తుడవనియనురక్తిగ వేడితిమి
సాంబా రక్తిగ వేడితిమి

18. శరణుజొచ్చితిమి అరమరసేయక కరుణజూడుమయ్యా
హరమీకృపగోరితిమయ్యా, పురహర వెరవుదీర్పుమయ్యా
కరిచర్మాంబరగరళకంఠ యాఖలునిద్రుంచుమయ్యా
సాంబా ఖలునిద్రుంచుమయ్యా

19. యీరీతిగ మొరబెట్టెడి యమరులమారహరుడుజూచి
వారలకనులనీరుదుడ్చి, క్రూరుని ద్రుంచెదననిబల్కి
కూరిమితో కనుసన్నజేసె దా గౌరిని వీక్షించి
సాంబా గౌరిని వీక్షించి

20. పతియుజేయు కనుసన్నగనుంగొని పార్వతి తాలేచి
పమరమొనర్పగ మదిదలచి, సరగున శక్తిసేన గూర్చి

దుష్టునివధ కైయ్యటకు కోజనదుర్గరూపుదాల్చి
సాంబా దుర్గరూపుదాల్చి

28. రణరసాతలంబెల్లను పరగునరసనగాను జేసె
కణశోణితములెల్ల ద్రావెన్, కలుషునిశౌర్యహీనుజేసెన్
మలినచిత్తుడతిక్రూరుండగుచును ముద్గరములురువ్వెన్
సాంబా ముద్గరములురువ్వెన్

29 నవమిదినంబున నానిశాచరుడు నసులెల్లనుద్రోక్కెన్
భవునిచేతిలోనజిక్కెన్. పావనుజనియె శమనపురికిన్
దేవతులెల్లనుపుష్పవృష్టియును వేమరుగురిపించెన్,
సాంబా వేమరుగురిపించెన్

30. అంతటగౌరియు నతిసంతసమునఅమరులుసేవింప
కాంతునిచెంతనిలచిబాగా, ఘనబుపితతియుబాగడివేగ
యిందువలనమహార్ణవమియను మభువియుందు జెప్పబడియె
సాంబా భువియందుజెప్పబడెను

31. విదితంబీయుద్ధంబువిశ్వమున వినుడిసుజనులార
వేడుకలాదవు నాట్యలాగ, మొలమితో దేవిబోచుచాల
పదపడియిది నవరాత్రిపంచునై బరగెపుడమిమీద
సాంబా బరిగె పుడమిమీద

32. యీవార్తలు నలువయినలినాక్షుడు విలసితముగ దెలిసి
దేవిచెనత్కృపయునువడసి,చిరముగ తేజంబునునొంది
విజయులు నైవిహరించిరిగానున విజయదశమియయ్యెన్
సాంబా విజయదశమియయ్యెన్

33. స్వామితో యీదేవిచరిత్రము కోరికలరవేగ
జదివిన ధీరులకునుభోగ, జయంబును గలుగునిప్పుడుచాల
ధారుణిలో గుడిపూడిపూర్ణకవి రచియించెనుబాగ
సాంబా రచియించెనుబాగ

రక్తాసురవధ సంపూర్ణము.

